హా రామా ! పైన నెత్తియుఁ గ్రింద నడుగులును మాడిపోవు

చున్నవి. శరీరమంతయుఁ జెమ్మటలు గ్రమ్ముచుండెను.

కీర్తన.

దీనబంధో ! సుగుణసింధో ! మొఱవిని నను గావవా॥

మానసమున నిన్నే యను ! మానమున లేకను నమ్మితి॥ దీన॥

వేడియెండలోన ! శిరము మాడుచుండె గా

పాదతలంపుబూని రావదేల॥ దీన॥

హార్కా—సరీగా నిల్చుండువోయ్ ! (గెంటుచున్నాడు.)

రామ—హా ! రామచంద్రా ! నా ప్రార్థనము వ్యర్థము సేయకుండ

రక్షింపుము.

మొదటిహార్కారు—అరే! క్యాజీ!బొమ్మనుక్కు కాళ్ళుకాలడం లేదు.

నెత్తిమాడడంలేదు. ఖోత్ హుషార్ గా నిలుసుండాడు.

రెండవ-హార్కారు—నాకీ అదేషూష్తుండాన్.

మొ-హ—ఇంక పీడ్కి-నఘాయి చెయ్యాలి.(రామదాసును యీవలకు

లాగి) క్యా ! పైసా యిస్తావు లేక చస్తావు. దేఖో ! మేరా

హాత్మే తర్వార్. (కత్తితోఁ బొడువఁబోవును.)

రామ—రాముని నుద్దేశించి)

సీ. ఇది కదా వేళ దుర్మదవరిపంథులా

హార్కార్లఁ దోలి న న్నరయుటకును

ఇదికదా సమయం బహీనకటాక్షంబు

పైఁ జిమ్మి నన్నుఁ గాపాడుటకును

ఇదికదా యదను మునీంద్రసన్నుతుఁడవౌ

నీవు ముదమున న న్నేలుటకును

ఇదికదా కాల మున్మదచిత్తులౌతురు

ష్కాలగర్వమెల్లను గ్రుంగుటకును

గీ. తండ్రి! యిదికదా సమయంబు ధరణియందు
రామదాసను పేరు సార్థకముఁ జేసి
కష్టములఁ దోలి నన్నును గాచుటకును
రామ! రాఘవా! రఘురామ! రామ! రామ!

ము-హ—పైకం మీరాముఁడు తెస్తాడ్, జూకీ చూస్తాం—
(కత్తితోఁ గొట్టుచున్నాఁడు.)

రామ—హా రామచంద్రా! నేనెంతపిలచినను నన్ను రక్షించుటకు రాకుంటివేమి! ఈదుష్కరతురుష్కులఖడ్గంబులకు నాదేహము బలి యొసంగవలసినదేనా! ఆర్తత్రాణపరాయణా! నీ వింతకుము న్నెందఱో భక్తులను రక్షించినావు.

ఉ. దాచినచుట్టమా శబరి దాని దయామతి నేలినావు; నీ
దాసుని దాసుఁడా గుహుఁడు తావకదాస్య మొసంగినావు; నేఁ
జేసినపాపమా వినుతిఁ జేసినఁ గావఁగరా వదేమి! నీ
దాసులలోన నేనొకఁడ దాశరథీ! కరుణాపయోనిధీ!

రెం-హ—(మరల కత్తితోఁ బొడుచుచున్నాఁడు.)

రామ—శ్రీహరి రామచంద్రా! దయఁబూనవా! హే శ్రీమన్నారాయణపరిపూర్ణావతారా! భక్తపరాధీనా! భవబంధవిమోచనా! అహల్యాశాపవిమోచనా! సుజనరక్షణకుజనశిక్షణబద్ధకంకణా! నీభక్తరక్షణబిరుదంబు నెందు దాచితివి! పిలచినఁ బలుకకున్న నన్నెవ్వరు రక్షింతురు! నీవు నాయెడల గాఠిన్యము వహించితివేల? క్రూరతురుష్కుల ఖడ్గప్రహారములకు నాయొడలెల్ల ముక్కలగుచున్నది. రామా! ధరణీభారనివారణంబునకుఁ బెక్కండ్రు రక్కసుల నుక్కడఁగించి దేవతలకు హితము గలిగించి, తాపసగణంబును బ్రోచిన నీకు—నన్ను-ఈతురుష్కుల బాఱినుండి తప్పించుట కష్టమా?

సీ. స్తంభంబు వెల్వడి దానవేంద్రుని నర
మృగమవై చంపిన మేటిబలము
నరకాసురాదిబల్ నక్తంచరుల లీల
సంగరంబునఁ గూల్చు శౌర్యపటిమ
జవసత్వములయందు సాటిలేనట్టి య
వ్వాలిని గూల్చిన బాహుబలము
జగమెల్లఁ గంపింప నల్పినరావణు
దర్పం బడంచిన ధైర్యగరిమ
తే. గీ. నెచట దాచినాడవు తండ్రి! యెంత మొఱ్ఱ
పెట్టుకొన్నను రావు; నీవేదురాత్ము
లైనమ్లేచ్ఛులవను భయం బందియున్నఁ
జెప్పఁగా నేల మముబోంట్ల జలజనాభ!

నీవు మహామ్లేచ్ఛులకు భయంబంది, భక్తుఁడనగు నన్ను రక్షింపఁ
జాలక యుంటివేమో యని తలంచెదను. అట్లు కాదేని యేల
రక్షింపవు?

సీ. ఖలు హిరణ్యాక్షు వక్కలుగఁ జేసిన వాడి
గోళ్ళపటిమత గోలువడితె?
రక్కసిముక్కు మ జక్కుజేసిన మేటి
దారుణాసివదును తప్పెనేమో?
నొకకోల వాలిని సుగ్రీవుపైఁ గూల్చిన
మునిశితాస్త్రమునకు మొనటిలేదె?
నాహవక్రీడలో నమరారి రావణుఁ
జంపిన బాణాగ్ని చల్లఁబడెనె?
తే.గీ. కాకయుండిన రావేల, నాకు రక్ష
ణంబొసంగ వదేల! దునాడ వేల?

కార్యర్థైర్యముల్ వ్రీకటించి సాహసమున;
దర్పకారాతిభీమ! కోదండరామ!

ము-హా—ఈదెబ్బతో సఫాయిచేదామ్.

రెం-హా—నాకత్తిదెబ్బ దేఖో—నీకి యుద్ధం యెవ్వడు వస్తాడో హం దేఖ్తా!

(ఇరువ్వురును రామదాసుపైఁ గత్తులు విసరగాఁ గత్తులుకనఁబడ కుండ మాయమగును.)

రామ—రామచంద్రా!

మ. వరఖడ్గంబులఁ బూని తీసెదను నీప్రాణంబులన్ నేఁడు నీ
శరణం బెవ్వరొ చూచుకొమ్మనుచు రోషంబేర్చిఖడ్గంబులన్
బరవోనాపయిఁ బ్రేమఁబూని సరగ్ గ ప్రాణంబు రక్షించితీ
వరయుగా భక్తజనార్తిభంజన! మహాత్మా! దైవచూడామణీ!

మొ-హా-అరే-క్యారే! బొమ్మగా మీాద యేస్నికత్తుల్ మాయమై పోయినాయి ఈలాంటి సిత్రం మనకు సొడ్గనూడా లేదు. హీ ద్కా నంవడం మన్కా నేత కాదు. మన్కీ-ఫాణంమీాదకి వస్తాది. (రామదాసును జూచి) గోవన్నాసాబ్! మీాకీ ఫర్వాసై. మాకి మీాజోర్కీ-రాం—మీాకు రాంరాం సర్కార్ హు కుంకు మీారు కొతిడీమె వుండండి. ధేముడ్కా మీామీాదపానా దయవుండాది. ఇదర్ ఆవ్ మహారాజ్! జైలుకు జావ్—
(నెమ్మదిగాఁ జెఱసాలలోనికిఁ దీసికొని పొర్ళుదురు.)

రామ—(తనలో) ఆర్తత్రాణకళావ్రీణుఁడ వన నీకే చెల్లును. తురుష్కుని కత్తి వ్రేటులు నాశరీరమున కొకటియైనఁ దగులకుండ రక్షించి మించితివి. ఇఁక నన్నుఁ జెఱనుండి శీఘ్రముగ విముక్తునిఁజేసి యేలుము.

మొ-హ.—ఇంక మనం యీామంగతి పాదుషా వారికి సెప్పావాలి పైన ఆయన సెల్వ—ఆవ్.

(తెర వ్రాలును.)

రంగము:—చెఱసాల.

[రామదాసుగారు విచారముతోఁ బ్రవేశము,]

రామ—(తనలో) హా! రామచంద్రా! నేనెంత వేఁడికొన్నను నింత వఱకును నన్ను దయఁజూడకున్నాఁడవు గదా! నేనెంత కాల మీరీతిఁ దురుష్క భటులచే బాధింపఁబడుచుఁ గారాగృహమున వసింపవలయును. స్వామీ! ఆజన్మాంతమువఱకు నాకిది యే వ్రాసియుంచితివా తండ్రీ! అయ్యో! యమకింకరులఁ బోలిన భటులు నాకరచరణముల బంధించి గ్రుక్కిన సుక్కుగుం డొ కటి తెచ్చి నావీపునఁ బెట్టి పురంబెల్లఁ ద్రిప్పిరి. ఈకఠినశిక్షలకంటె వారాడు దుర్భాషణంబుల భరింపఁజాలక యున్నాను దేవా! నాధార మంతయు నీయదే యని నమ్మి ధైర్యముతో నుంటివి, భవదీయదివ్యనామస్మరణము నిఖలరోగముల నిర్మూలముఁ జేయుననియు, భవభయంబులనెల్లఁ బాఱదోలు ననియు, సమస్తవిధమైన యాపదలను నులిమివేయుననియు, శాత్రవవిజయంబుఁ జేకూర్చుననియు, సకలమంగళములఁ గూర్చుననియు మహనీయులు వచింతురు కదా! అట్టియెడఁ బ్రపంచమున నీపాదారవిందచింతనముకన్న నన్యచింతన మెఱుంగక నిన్నే యాశ్రయించియుండు నామీఁదఁ గరుణఁ జూపింపకయుండుట మిగుల వింతగ నున్నది. రామా! నీవాఁడు మహిపాకారంబునవచ్చిన నిన్నెఱుంగక బ్రహరించితి వని నాపై నీకలుకా!

సీ. అందమా యిది నీకు చందమా నన్నిట్లు
గుందఁజేయుట నేఁడు సుందరాస్య?
కోపమా లేక నాపాపమా ఘోరసం
తాపమునఁ గూర్పంగ భూపమౌళి?
నేరమా నాయందు భారమా నీకు వి
చారమ్ము గల్గింప సారసాక్ష?
ధర్మమా యిది నీకు మర్మమా లేక నా
కర్మమా యిటుచేయఁ గర్మసాక్షి?
తే.గీ. ఎంతపిలచిన నేఁడు రావేల? సుంత
మొనజూపింప వేల? నీయలఘుకరుణ
బాధలను మాపి యీచెఱఁ బాపవేల?
దాసజనహృద్విలాస! సీతానివేశ!

మహానుభావా! నాయం దేమయిన నేరము లున్న క్షమియింపుము. దాత వని నిన్ను నమ్మిన నాయెడలఁ బాతకము లెంచవలదు, ఒకవేళ నాయందు లోపము లున్నను నీపాదారవిందసంస్మరణముచే నవియన్నియు మాయమైపోవునుగదా! తండ్రీ! నీవు నన్ను రక్షింపఁదలంచితివేని నీకు శక్యముగాని దేమున్నది? అటయ మగుదవ్యముసంగఁదలంచితివేని నీశ్వేత భార్య యగు లక్ష్మీదేవి లేదా? ద్వితీయపతిమణి యగుభూదేవి రత్నగర్భ గాదా? కల్పతరువు, కామధేనువు, చింతామణియు నీయధీన మున లేవా? శ్రీరాముని వార మగు మాకేమివిచార మని తలంచి, నీవే యాధారమని నమ్మియుంటి ఘోరాంధకార మగు సంసారము నిస్సారమని యెంచితిని నిన్నుఁ జింతించుటే సారమని తెలిసికొంటిని. కాని నన్ను రక్షింపరాకుండుటకు మాత్రము గారణ మెఱయఁజాలకయుంటిని.

మ. కరి రక్షింపవా; దైత్యరాజతనయుం గాపాడవో ద్రౌపదిన్
వరవస్త్రంబుల నిచ్చి కావవొ, కృపావారాసివై పక్షికిం
ధరుతమ్ముం రిపుఁడంచు నెంచక రమా లంకారాజ్యమం దుంచవో!
శరణన్నన్ నను బ్రోవవేమి బుధరక్షా! జానకీనాయకా!

(ఇంచుక యూరకుండి) దేవా! ఇంక నీవు నన్నుఁ గృపఁజూడవు. ఈ కష్టములన్నియు నేను నీనిమిత్తముకదా పడుచుంటిని. సమస్త జగములను గుక్షియందు నిలిపికొని నీవు నాహృదయమున నిల్చి బాధలఁ బాపి, చెఱ విడిపించవేల? నాప్రార్థనములెల్ల వ్యర్థము సేయుచుంటివి కదా నీయందు నిరంతరముఁ జిత్తముఁ జేర్చి సర్వాధారుఁడవైక మంతయు నీకైంకర్యమునకై వెచ్చపెట్టి నే నీరీతిని వంతలమునింగి నిన్నుఁ బ్రార్థించుచుండఁగా నాయెడల నొక్కింత కరుణఁ జూపవేల! తండ్రీ! నీ వింతకఠిన హృదయుఁడవని యెఱుంగనైతిని నీసేవావిషయమై నే నొనర్చిన లోపమేమియున్నది? నాయిష్టదైవతమగు నీవుజీర్ణాలయంబుననుండుట మంచిదికాదని తదాలయోద్ధారణగావించి చుట్టునుఁ బ్రాకారములఁగట్టించితినే! భగవంతా! రామచంద్రా! ఆప్రాకారమునకుఁ బదివేలవరహాలు పట్టెఁగదా! ఎంతయో ధనము వెచ్చించి గోపురమంటపాదులనిర్మించితినే! నీతమ్ముఁడు భరతునకుఁ బదివేలవరహాలుపెట్టి పతకమును, లక్ష్మణునకు ముత్యాలహారమును, శత్రుఘ్నునకు మొలత్రాడును, జేయించితి గదా! దేవా! మాసీతమ్మతల్లికి, జగన్మాతకు, నీయర్ధాంగికి, సుగుణసంభూతకు, భువనవిఖ్యాతకుఁ జింతాకుపతకము జేయించితినే! మాతండ్రి వగు నీకు వాహనంబులు సేయించితినే!—ఇవి యన్నియు మీకుఁ జేయించినందుకే కదా నాకీ సంకెళ్ళు వేసిరి! రామా! కువలయదళశ్యామా! పరంధామా!

నేను పడుచున్న కష్టములన్నియుఁ జూచిన నీకు సంతోషముగ నుండెను గాఁబోలు! నేను నీకుఁ జేయించిన కలికితురాయి మొదలగునవి పెట్టుకొని కులుకుచుంటివి. ఇయ్యవి మీతండ్రి యగు దశరథుఁడుగాని మీమామ యగు జనకమహారాజుగాని పెట్టెనని తలంచుచుంటివా! ఇదియంతయు దాసుఁడు నీయం దున్నభక్తిచేఁ జేయించి ముదమందుచు, నీచెఱం బడెనని తలంచి రక్షింపక జాగుచేసిన, నేనిఁక నెవ్వరిమఱుఁగుఁజొత్తును (ఇంచుక యూరకుండి) హే! జగన్నియామకా! దశరథనందనా! నేను నీయెడల నింతకఠినముగాఁ బలుకుచుంటినని యాగ్రహింపవలదు. స్వామీ! తురుష్కులు నన్నుఁ బెట్టుచున్న కష్టంబుల కోర్వఁజాలక యిట్లు పలుకుచుంటిని.

కాంభోజి—ఆదితాళము.

ఇక్ష్వాకుకులతిలక - యిఁకనైన బలుకవె - రామచంద్రా, నన్ను
రక్షింపుమీవట్ల రఘుకులతిలకా శ్రీ .. రామచంద్రా॥ ఇ॥
చుట్టుప్రాకారములు - సొంపుతోఁగట్టిస్తి - రామచంద్రా, ఆ
ప్రాకారమునకుఁ బట్టె - పదివేల వరహాలు - రామచంద్రా॥ ఇ॥
గోపురమంటపా - లుకుదురుగా గట్టిస్తి - రామచంద్రా, నన్ను
కాత్రగ జూడక - నిత్తఱి బ్రోవుము - రామచంద్రా॥ ఇ॥
భరతునకు జేయిస్తి - పచ్చలపతకము - రామచంద్రా, ఆ
పతకమునకుబట్టె - పదివేల వరహాలు - రామచంద్రా॥ ఇ॥
శత్రుఘ్నునకు నేను - చేయిస్తి మొలత్రాడు - రామచంద్రా, ఆ
మొలత్రాటికిబట్టె - మొహరీలు పదివేలు - రామచంద్రా॥ ఇ॥
లక్ష్మణునకు జేయిస్తి - ముత్యాలపతకము - రామచంద్రా, ఆ
పతకమునకు బట్టె - పదివేల వరహాలు - రామచంద్రా॥ ఇ॥
సీతకు జేయిస్తి - చింతాకుపతకము - రామచంద్రా, ఆ
పతకమునకుఁబట్టె పదివేల వరహాలు-రామచంద్రా॥ ఇ॥

వాహనములు మీకు - వరుసతో జేయిస్తి - రామచంద్రా, జగ
న్మోహనపంకెళ్ళు - వేసిరి కాళ్ళకు - రామచంద్రా॥ ఇ॥
కలికితురాయి నీకు - పొలుపుగ చేయిస్తి - రామచంద్రా, నీవు
కులుకుచు తిరిగెద - వెవరబ్బ సొమ్మని - రామచంద్రా॥ ఇ॥
మీతండ్రి దశరథ - మహారాజు పెట్టెనా - రామచంద్రా, లేక, మీ
మామ జనక మహారాజు పంపెనా - రామచంద్రా॥ ఇ॥
అబ్బ తిట్టితినని - యాయాసడవద్దు - రామచంద్రా, ఆ
దెబ్బల కోర్వక - అబ్బ తిట్టితినయ్య - రామచంద్రా॥ ఇ॥
పటికిబల్లిన నీళ్ళాయె నా బ్రతుకు - రామచంద్రా, నేను
అధమునికంటె - నన్యాయమైతిని - రామచంద్రా॥ ఇ॥
సర్వాపరుపైకము - తృణముగ నెంచుకు - రామచంద్రా, ఈ
దెబ్బలనుగాచి - యప్పుదీర్పుమయ్య - రామచంద్రా॥ ఇ॥
కౌసల్యపుత్రుడ - దశరథ తనయుడా - రామచంద్రా, కావు
క్షేమముగ - భద్రాద్రిలో నెలకొన్న శ్రీరామచంద్రా॥ ఇ॥
భక్తులనందరినీ - పరిపాలించెడి శ్రీరామచంద్రా నీవు
క్షేమముగ శ్రీ - రామదాసుని నేలుము శ్రీ - రామచంద్రా॥ఇ॥

తండ్రీ! రామదేవా! నన్నేలరక్షింపవు. నేను పరులను వేడను. పైక
మిమ్మని నన్నీబంధిఖానాయందు తానీషా యుంచికట్టినాడు॥
దేవా! నీవు నాఋణముం దీర్చవేమి! నీచేత కాకున్నచో
మాతల్లి యగుసీతామహాదేవితోనైన మనవి జేసికొందును.
(ఇంచుక యూరకుండి) రామా! నన్ను రక్షింపకయున్నచో
నిన్ను విడువను. కట్టుచేసి నిన్నరికట్టుదును. నేనునీపదాంబుజం
బులనే గట్టిగఁ బట్టినాను, నిన్ను వేడినకాలఁదిని వెనుకకుఁబరు

గిడుచుంటివి. ఏమైననునరే! నీ సేవయొనర్చి నిన్ను రవ్వచేసె దను. మహాత్మా! ఇంక నేను తాళఁజాలను, నాకు బంధవిము క్తిఁగూర్చి నీదాతతనము చూచుకొమ్ము. రక్షించెద నని నా కభయ మీయకయుంటివేని యడుగుదాఁటి నిన్నవతలకుఁగదల నీయను. నీసేవ యొనర్చి విసిగిపోయితిని, కొంగబాటను విడిచి నీపదకమలములను నాహృదయమున బంధించివేయు దును. నీపతితపావనబిరుదముఁ గాచుకొమ్ము. ఇంకనన్ను రేప నియు, మాపనియుఁ, ద్రిప్పక రక్షించి నీమహాత్మ్యమును బ్రక టింపుము. (ఇంచుక యూరకుండి) ప్రణతార్తిభంజనా! పర మపురుషా! నన్ను రక్షించుటకు నీకు సామర్థ్యము లేకపోయి నచో సీతామహాదేవికైనఁ జెప్పి, నన్నుఁ గష్టరహితునిగాఁ జేయింపుము. హా సీతమ్మతల్లీ! శ్రీరామచంద్రమూర్తికి నా యం దింతవఱకుఁ గరుణ రాకయున్నది. అమ్మహనీయుఁడు నా యందు చలము వహించినాఁడు. దీనరక్షకుఁడని నమ్మి నేనొన ర్చిన సేవయంతయు నడవిఁగాచిన వెన్నెలభంగి వ్యర్థమైనది. అమ్మా! నీవైనను నాయందుఁ గరుణాంతరంగవై, నేను పడు చున్నకష్టము లన్నియు రామచంద్రమూర్తితో విన్నవించి నన్ను రక్షింపుము. నేను పడుచున్నశ్రమలఁ బాపుటకు రామ మూర్తి యిదెవచ్చునదె వచ్చునని యనుదినంబును నెదురుచూ చుచుంటిని. ఓజగజ్జననీ! ఇఁక నీవైనను దాసుని రక్షింపకయుం డుట ధర్మముగాదని బోధించి తానీషాకు నే నీయవలసిన పైకముతో రామయ్యతండ్రిని బంపుము. ఇంక మీరు నన్ను రక్షింపకయున్నచో శీఘ్రముగఁ బ్రాణముల బాసి మీచరణ సన్నిధిఁ జేరుకొందును.

మ. జననీ! రాముఁడు సత్యపారహితుఁడై చన్నేరఁ దయ్యెన్ ననున్
గని రక్షించుటకై; యిఁకేవిధిని వైరంబంతయున్ దీర్చి, దు
ర్జనులౌ మ్లేచ్ఛులబాధఁ దాఁటుదును; సంరక్షింపు మీవైననున్
ఘనకారుణ్యకటాక్ష వీక్షణసుధా కల్లోలవారాసివై.

మ. అమ్మా! రామపదారవిందయుగళ ధ్యానైకచిత్తుండ, నే
నిమ్మాడ్కిన్ జెఱఁ గుందుచుండుటను వీక్షించి సైరింప న్యా
యమ్మే! రాముఁడు బ్రోవకున్న, నిఁక నీవైనన్ ననుం గావ వే
రమ్మా! మ్రొక్కెద భక్తి నీ కిదె రమా రామామణీ! జానకీ!

[తురుష్క భటుఁడు ప్రవేశించును]

తు॥భ—(రామదాసుని జూచి) అరే! మియ్యా! భోల్ గల్లంతా సే స్తావు. క్యాకు నిద్దర్ పోతేదిలేదూ! రాముడ్కి నలిపిసంపుతుండావ్. అదువచ్చేదిలేదు. నీకీ పైకం ఘిల్లించేదిలేదూ. ఖైద్ విడిసేదిలేదు. జరా సోజావ్ బామ్మన్. మీకీ సలాం చేస్తామ్. మాకీ నిద్దరనైతో మా దేహాంకి భోల్ బేమారి వస్తాది.

రామ—(తనలో) దీనబంధూ! రామచంద్రా! ఇఁక నీవు నన్ను రక్షింప సమర్థుఁడవు కావు గావున సీతమ్మతల్లి శరణుఁ జొందినాను. (సీతాదేవి నుద్దేశించి) ఓతల్లీ! జానకీమహాదేవీ!

మ. ఇఁకనైనన్ నను సత్కృపం గనఁగ మీ రేతెంచకున్నన్ బుధ
ప్రకరంబున్ సతతంబుఁ బ్రోచెడు భవత్ప్రాణేశ దివ్యాంఘ్రిల
త్యకలంకస్థితి నాత్మఁ జేర్చి రఘునాథా యంచుఁ బ్రార్థించి మా
మక జీవంబుల వీడి చేరుదు మదంబా! మిమ్ము భూపుత్రికా!

(భటుని జూచి) ఓయీ! భటుఁడా! నామూలమున మీకుఁగూడ నిద్ర లేకయున్నది కదా! ఇఁక మీశ్రమలును నాశ్రమలును గూడఁ బోవును. ఇఁక మా రామయ్యతండ్రి కాని, మా సీతమ్మ

తల్లికాని, పాదుషాకు నేనొసంగవలసిన పైకమిచ్చినన్ను రక్షిం
చరేని నేను ప్రాణములు, బాసి సుఖించెదను.

తు॥ ఖ—అరే! బొమ్మర్ బలవంతముగా ఫాణాల్ విడిసేలో మాకీ
తంటావస్తుంది. మమ్మల్ని నంచకూ జరా వందుకో.

రామ—హా! రామభద్రా!

(తెర వ్రాలును)

---

రంగము:—శయనగృహము.

[శ్రీరాముఁడు, సీత, వేఱువేఱు తల్పములయందు నిద్రించుచుందురు]

సీత—(త్రుళ్ళిపడి లేచి) హా! ఎవరు? ఆర్తుఁడై నన్నీరీతినిఁ బ్రార్థిం
చుచున్నాఁడు?

శ్రీరా—(హఠాత్తుగ లేచి) రమణీ! ఏమది! కలవరించుచుంటివా?

సీత—నాథా! కలవరించుటలేదు. నిశ్చయముగా నన్నెవ్వరో తన్ను
రక్షింపుమని కోరుచున్నారు (ధ్యానము నటించి, సరే! తెలిసి
నది. మీచరణభక్తుఁడగు రామదాసనామమునఁ దనరుచున్న
గోపన్నయే (శ్రీరామునితో) ప్రాణేశ్వరా! ఇంతవఱకును
మీకు వినఁబడుచుండుటయే లేదా?

ను. చెఱలోఁ జిక్కితి, బాదుషాకు ధనముల్ చెల్లింపలేదంచు దు
ర్గరువంబేర్చి తురుష్క సేవకులు నన్ గారింపుచున్నారు, నీ
చరణంబుల్ మది నమ్మినాఁడ జగదీశా! బ్రోవవే యంచు,నీ
వరభక్తుండగు రామదాసు నిను సంప్రార్థించుటల్ గాంచవో.

ఆ రామదాసు మీకుఁ బరమభక్తుఁడుకదా! అతఁడు వెచ్చించిన ధన
మంతయు మనకొఱకే కదా! ఆర్తత్రాణపరాయణులగు మీ
రతని మొఱ వినియు నూరకుండుటకుఁ గారణమేమి?

చ, దినకరవంశదీపకులు దీనజనావను లంచు లోకముల్
ఘనముగఁ జాటుమాటలను గాంచవె! నీపదనీరజంబులే
మనమున నమ్మి యెప్పుడు సమంచితభక్తినిఁ గొల్చు రామదా
సుని కృపఁ బ్రోవఁజూడ విది చోద్యము గాదె! విపక్షశిక్షణా!
దాసపోషణ బిరుదమునకు భంగము గల్గించుకొందురా?

శ్రీరా—

మ. రమణీ! భక్తుఁడు రామదాసు చెఱ సంతాపంబునుం బొందుటఁ
బరిశీలించుచునుంటి; నాకునయి ద్రవ్యం బెంతో వెచ్చించి యా
కరణిఁ బాల్పడెనం జెఱంగుడును; వేగ వాని రక్షింపఁగాఁ
దెరు వూహించుచు నుంటిఁ, బ్రోతు నిఁక సందేహంబునీకేటికిఁ।

ఆగోపన్న దీనాలాపములన్నియు నాచెవులఁ బడుచునేయున్నవి,

సీత—అట్లయిన జాగుసేయనేల? ఈయాలోచన యెందుకు? అన
దోద్ధారకుండ వనుబిరుదము గాపాడుకొనఁదలంచితివేని రామ
దాసును నేఁడు రక్షింపుము. ధ్రువప్రహ్లాదాదిభక్తులను ధ్రువ
ముగఁ గాపాడిన మహనీయుఁడవేని, యాతనినిఁ గాపాడుము.
(ఇంచుక యూరకుండి) మనోహరా! ఇంక నాలోచనతోఁ
బని లేదు.

బేహాగ్.

మనవి విని సరగున - రామదాసునేలఁగఁ జనుమా।
ఘనచెఱ బాపుము - మనదాసునిమొఱ - వినుమా। మన॥
సర్కార్ పైకమెసఁగుమని - హర్కారు లతిక్రూరులై
తుర్కవజీర్ యనుమతిఁగొని-తర్కించుచునుండిరి నాథా॥ మన
వాసిగదాసుని నీవిపు డేలకయున్న
భూసురుఁ డాతఁడు మనకై - ప్రాణము వాయును॥ మనవి॥

శ్రీరా—రమణీ! అతఁడు భక్తాగ్రేసరుఁ డనుమాట నాకు సంపూర్తిగఁ దెలియును. కాని యింతవఱకును గొండొక కారణముచేత నతని రక్షించుట కాలస్యము గావించితిని. లేకున్నచోఁ బరమభక్తుఁడగు నాతఁడింతవఱకు బందిగమునఁ గృశింపనవసరము లేక నేయుండును.

సీత—దేవా! కారణ మెఱుంగవచ్చునా?

శ్రీరా—రూపామణీ! ఈతఁడు పూర్వజన్మమున దేవలుండను మునియై నన్నుఁ బరిహరించుట నీవెఱింగిన దేకదా! అదిగాక యీతఁ డొకకీరమును దెచ్చి పంజరమునఁ బెట్టి, దానికి "రామ" యనుశబ్దము నేర్పి ముద్దుగాఁ బెంచెను, దానికి రామ నామస్మరణము నేర్పినకారణమున నీతఁ డీజన్మమున నాకుఁ బరమభక్తుండై విలసిల్లెను. శుకమును బంధించిన కారణమున నిప్పుడు చెఱఁ బడవలసివచ్చెను. ఆపాపము నశించినది. ఇఁక నతనికిఁ గారాగృహ విముక్తి గూర్చెద.

సీత—నాథా! అతనికిఁ గారాగారవిముక్తి యెట్లుగూర్చెదరు?

శ్రీరా—రామదాసు తానీషా కీయవలసిన పైకమును నేను చెల్లించుదును, నేను లక్ష్మణసమేతంబుగా నీక్షణంబునఁ దానీషాకడకరిగెదను.

సీత—అతిపాపాత్ముఁడును, తురుష్కకులసంభూతుఁడును నగు తానీషాకు మీదివ్యదర్శన మొసంగెదరా?

శ్రీరా—చకితాక్షీ. తానీషాను మన మలఁతిగఁ జూడవలదు. నీవక నైవ్యసంబంధమును బట్టి యాతఁడు రామదాసు నట్లు బంధించినాఁడు. అదియుంగాక, రామదాసుఁ శిక్షింపక విడిచినచోఁ దక్కినవారుకూడ నట్లే సేయుదు రని సంశయించి, యితరులకుఁ గొంతభయము గల్గించుట కట్లుచేసియుండును. అతఁ

మదీయసందర్శనము చేసికొనుటకు మఱియొక విశేషమున్నది. ఈతానీషా పూర్వజన్మమున శివానందుఁడను నొకబ్రాహ్మణుండై యుండి, గంగానదీతీరమున వసించుచుఁ బరమేశ్వరునిఁ గూర్చి తపము సేయుచుండెను. ఎన్నాళ్ళకును నమ్మహనీయుండు దర్శన మొసంగనందుకు విసిగి క్షీరఘటము నొండుచంద్రమౌళిశిరముపైఁ బడవేయ, వాఁడు సాక్షాత్కరించి "నీవు బ్రాహ్మణుఁడ వయ్యును తామసుండవై తివి. ఆకారణమున ముందుజన్మమున మ్లేచ్ఛుఁడవై రాజ్యాధిపతివై శ్రీహరిసందర్శనమున సమస్తకలుషములఁ బాయుదు" వని యానతిచ్చెను. పరమేశ్వరునివాక్యము నిలుపుటకు నే నిప్పుడు తానీషాకుదర్శనం బొసంగవలయును.

సీత—జగన్నాటకసూత్రధారు లగు మీచిద్విలాస మెవ్వరికిఁ దెలియును?

శ్రీరా—సతీమణీ! ఇఁక నే నాలసింపరాదు. లక్ష్మణునితో నిప్పుడే యరిగెదఁగాక. నీవు శయనింపుము.

(నిష్క్రమించును)

ఇది చతుర్థాంకము.





శ్రీ

# రా మ దా సు.



## పం చ మా ం క ము.

రంగము:—తానీషా యంతఃపురము.

[తానీషాయు, భార్యయుఁ బ్రవేశము]

భార్య—నాథా! తొందరగ నన్ను మేల్కొలిపితిరేఁ? మీకేమయిన స్వప్నము వచ్చినదా యేమి?

తానీ—రమణీ! నీవుతలంచినట్లు నిజముగా స్వప్నమే వచ్చినది.

భార్య—ఎప్పుడును మీకేదియో స్వప్నము వచ్చుచునే యుండును

తానీ—నిజముగా నిప్పుడు నా కొక గొప్పస్వప్నమే వచ్చినది. ఆస్వప్నవృత్తాంతముఁ జెప్పుటకు మేనఁ బులకలు వొడముచున్నవి. ఎవ్వరో యిరువురుసుందరపూరుషు లరుదెంచి, రామదాసు పైకము చెల్లించి రసీదుఁ గొనిపోయిరట. కలలోఁ దోఁచిన యాపురుషులు మహానుభావులవలె నున్నారు.

భార్య—ప్రాణేశ్వరా! ఏమి! ఈ వెఱ్ఱిభ్రమ! ధన మొసఁగలేక కారాగృహమునఁ జిక్కిన రామదాసునిమిత్తమెవ్వరు ధన మిచ్చుటకు వత్తురు?

(తలుపు చప్పుడు వినవచ్చును.)

తానీ—ద్వారము తెఱవఁబడిన చప్పుడు వినవచ్చుచున్నది.

[శ్రీరామ లక్ష్మణులు ప్రవేశింతురు]

శ్రీరా—తమ్ముఁడా! భక్తరక్షణమహోద్యోగము వహించి, సప్తద్వారములయం దుండురక్షకభటులను దాఁటి యీతానీషాయంతః పురమును బ్రవేశించినాము. ఇఁక శీఘ్రముగ మనము తానీషానుజూచి, పైకము చెల్లించి రసీదు పుచ్చుకొని రామదాసు కడకరిగి యతనికి ధైర్య మొసంగవలయును.

లక్ష్మ—అగ్రజా! ఇదిగో! తానీషా శయనమందిరము. కవాటములు బంధింపఁ బడియున్నవి.

శ్రీరా—అయిననేమి! తలుపుతీయు మని తానీషాను పిలువుము. మన కిట భయ మేమున్నది?

లక్ష్మ—(తలుపు దగ్గర కేగి) తానీషా! తానీషా! ద్వారము సత్వరముగఁ దెఱువుము?

తానీ—(తొందరపడుచుఁ దనలో) ఈయర్ధరాత్రి నన్నుఁ బిలుచువా రెవరు?

భార్య—ఈయర్ధరాత్రిసమయమునఁ జేయవలసిన రాచకార్యము లేమున్నవి? ఈ వచ్చినవారు సప్తద్వారములను దాఁటి శయన మందిరము నెట్లు సమీపింపఁగలిగిరి. నాకేమో వింతగనున్నది.

శ్రీరా—(తానీషా నుద్దేశించి) తలుపు తీయవేమి! మేము మరల సత్వరముగఁ బోవలయును.

తానీ—ఎవరుమీరు? ఈయర్ధరాత్రిసమయమున నేలవచ్చితిరి ?

లక్ష్మ—నీకుఁ బైక మియ్యవలసి వచ్చినాము. ముందు తలుపుదీసి యీవల మాటాడుము.

తానీ—(భార్యం జూచి) సతీమణీ! నీవు లోని కేగుము. వారెవరో రాచకార్యమువిషయమును గూర్చి తొందరగా మాటాడు టకు వచ్చియుందురు.

భార్య—(నిద్రించును.)
దాసీ—(లేచి తలుపుఁ దీయును. రామలక్ష్మణులు తాసీమాసు ప్రవే
    శింతురు.)
దాసీ—(ఆశ్చర్యమునందుచుఁ దనలో) ఇట్టి దివ్యమంగళస్వరూపు
    లను మున్నెన్నఁడును జూచియుండలేదు. ద్వారరక్షకభటులను
    దాఁటి యీయర్ధరాత్రి వీరిచ్చటి కేవిధమున రాఁగలిగిరో కదా!
లక్ష్మ—(నేలపై ధరహాలు గుమ్మరించును.)
దాసీ—(తనలో) వీరిని జూడ నాకు మిగుల యద్భుతము కలుగుచు
    న్నది. నెమ్మదిగా వీరియుదంత మరసెదఁగాక! (ప్రకాశముగా)

సీ. ఏది దేశము మీది? యేవ్వరంపిన నిట్లు
        వచ్చినారు? రిట్టి భయము లేక
    హరిహరాదులకైన నలవికానట్టి నా
        సాధ మెట్టుల చేరఁజాలినారు?
    అర్థమంతయుఁ జూడ నాశ్చర్యమయ్యెను
        భూరిభారము నెట్లు మోసినారు?
    భవదీయరూపముల్ పరికింప మాయగా
        నాకును దోఁచె మనంబునందు!
తే. గీ. యింతయర్ధరాత్రివేళ యేల మీరు
    వచ్చినారు? ధనమిదేమి? భళిర! మిమ్ముఁ
    గాంచ నాశ్చర్యమెంతయో గలుగుచుండెఁ
    దథ్యముగఁ దెల్పుడీమీరు దాచకిపుడు.

శ్రీరా—వీరభటపరిరక్షితమైన ద్వారము లెట్లు దాఁటితిమనియు, నింత
    పైకము మేమెట్లు మోయఁగల్గితిమనియు నీకు నాశ్చర్యమగు
    చున్నదా! మాయుదంత మెఱుఁగగోరితివి గాన వినుము.

మోహన—అట.

భద్రాద్రిపురమున మేము- బహుదినములనుండి కాపురము!
అద్రిజాధిపబ్రహ్మేంద్రాదులెల్ల
భద్రములొసఁగెడి భవ్యనిదానము॥ భ॥
ఇనవంశజులము మేమిద్దరము-చాలా-దినములనుంచియున్నాము
అనిశము రామదాసుని యాజ్ఞచొప్పున
పనులు సేయుచు నింటియొద్ద నేయుందుము॥ భ॥
ఖయిదుచేసినవార్త దెలిసి-యిల్లు-ఇయులుదేరి మిమ్ముగలసి
పైకము చెల్లించి భక్తునియాపద
బాపి గొంపోయెడి పనికై వచ్చితిమి॥ భ॥
భక్తుఁడైనరామదాసుని-యెంతో-సక్తుజేసిరి మంచిమేలని
ముక్తినిదానమగు యుక్తి తెలియక యీ
వ్యక్తినర్థాపేక్షకై యిటుచేసిరి॥ భ॥
మించినకార్యమే మాయె-యెంతో-వంచన సేయుటలాయె
సంచులన్ని మీరేయెంచి రసీదు వ్రా
యించి సెలవు నిప్పించండి వేగమె॥ భ॥
రామదాసుని రక్షించు-అతి-ప్రేమతో మాకప్పగించు
స్వామియా భద్రాద్రిసదయుని కనుఁగొన
రామదాసునిగూడి రయమునఁ బోవలె॥ భ॥

తానీ—(తనలో) వీరిమాటలు మిగుల నాశ్చర్యముగానున్న వే! రామదా సీయవలసినపైక ము సంగి విడిపించుకొనిపోవుట కువచ్చినారఁట! (ప్రకాశముగా) ధీరులారా! సర్కారుకుఁజెల్లించవలసినపైకము హరించుటచే రామదాసు చెఱయందు బంధింపఁబడినాఁడు.

శ్రీరా—అవును. ఆసంగతిమాకుఁ దెలియును. ఇదిగో మేము పైకము తెచ్చినాము. ఇది మీరు గైకొని మాకు రసీదువ్రాసి యొసంగుఁడు. రామదాసుని యాలుబిడ్డలతనికై పరితపించుచు క్షేమ మరసిరమ్మని చెప్ప నిట్లువచ్చితిమి. క్షణకాల మాలస్యమునకైనను మే మోర్వఁజాలము.

తానీ—మీ నివాసస్థల మేదియో తెలుపరేమి?

శ్రీరా—గోదావరీతీరముననున్న భద్రాచలమని చెప్పియుంటిమికదా?

తానీ—మీ రెవ్వరిసేవకులు? ఎవ్వరిపంపున నిట్లు వచ్చితిరి?

శ్రీరా—దాససేవకులము. రామదాసు పంపఁగ వచ్చితిమి.

తానీ—మీకుల మేది?

శ్రీరా—రఘుకులము.

తానీ—మీ రిరువురు నేమగుదురు?

శ్రీరా—అన్నదమ్ములము. రామోజి లక్ష్మోజి నామంబుల నొప్పుచున్నాము.

తానీ—ఎన్నితరములనుండిమీరు రామదాసుకొలువు సేయుచున్నారు?

శ్రీరా—తాతముత్తాతలనుండియు.

తానీ—మీ కేమిజీత మిచ్చెదరు?

శ్రీరా—జీతముతో మాకుఁ బనిలేదు. ప్రసాదమే.

తానీ—మీ రెందుకువచ్చినారు?

శ్రీరా—రామదాసు చెల్లించవలసిన పైక మిచ్చుటకని యింతకు ముందే చెప్పితిమికదా?

తానీ—ధనమంతయుఁ దెచ్చితిరా?

శ్రీరా—తెచ్చితిమి.

తానీ—రండు! ఈయాసనములపైఁ గూర్చుండుఁడు.

శ్రీరా—అయ్యా! మే మిచ్చటఁ గూర్చుండువారము కాము.

దాసీ—అట్లు పలికెదరేమి ? (ఇంచుక యూరకుండి) పోనిమ్ము, అలు లక్షలు తెచ్చితిరా ?

శ్రీరా—అంత పైకము మే మిచ్చు కొనంగఁగలమా? పది మిచ్చెదము.

దాసీ—సరే! తెచ్చినది యియ్యనంగూడదు. ఆపైన చిత్రము చూచెదరు గాక!

లక్ష్మ—పదివేలుమాత్రమే తెచ్చితిమి.

దాసీ—ఏమిది! నాతో హాస్యమాడుచుంటిరా?

శ్రీరా—మేము హాస్యమాడువారము కాము.

దాసీ—మీదగ్గఱ నున్న పైక మిచ్చి మీరుకూడ బందిగమును బ్రవే శింపుఁడు.

శ్రీరా—మే మట్లు ప్రవేశించువారము కామని యెఱుంగుము. నీపైక మంతయు నొసంగెదము. (క్రిందనున్న పైకముజూపి) ఇదిగో పైక మెంచుకొని వెంటనే మాకు రసీదు నిచ్చి పంపుము.

దాసీ—ఈయర్ధరాత్రి రసీదెట్లొసంగుదును?

శ్రీరా—ఉంగరము విజ్ఞమందు నద్ది చేరుమాలుపై మోహరు చేసి యిమ్ము.

దాసీ—అంతతొందర యేల? ఉదయమున రాఁగూడదా?

శ్రీరా—కాదు. కాదు. ఈపని యిప్పుడే జరుగవలయును.

దాసీ—(పైకము నెంచుకొని తనలో) ఆహా! ఇదియంతయుఁ జిత్రముగ నున్నది. (చేరుమాలుపై రాముఁడు చెప్పినవిధమున రసీదువ్రాసి యుంగరముతో మోహరుచేసి) ఇదిగో! రసీదు.

శ్రీరా—(పుచ్చుకొని) సరే! ఇఁక మేము పోయెదము. (కొంచె మీవ లకువచ్చి లక్ష్మణునితో నంతర్ధానమగుదురు.)

దాసీ—(చూచి) ఏరివారు! కన్నుమూసి కన్ను తెఱచునంతలోనే మా యమైరి. అక్కటా ! నేను మోసపోయితిని. నిశ్చయముగా

మ్మహానుభావులు రామలక్ష్మణు లనుటకు సందియము లేదు. నే నెంతయవివేకి నైతిని. (ఎదుటఁజూచుచు) సతీమణీ! సతీమణీ! నిద్రించుచుంటివా ?

(నిష్క్రమించును.)

(తెర వ్రాలును)

---

రంగము:—చెఱసాల.

[రామదాసు ప్రవేశము]

రామ—(శ్రీరాము నుద్దేశించి) హా! రామచంద్రా! నీవు కఠినాత్ముఁ డవని తెలియక నిన్ను సేవించి నేను మోసపోయితిని. కాదు ..న్నచో,

మ. చెఱనీకీర్తిని జిక్కి నీచరణరాజీవంబులే నాకుసున్
శరణంబంచుఁ దలంచియుండఁగఁ గృపన్ రక్షింపరాదైతి, నీ
పరిభావంబును దీర్పవైతివి చెఱన్ బాపంగ లేవైతి వే
కరణిన్ దీనుల నేలఁజాలితివొ మున్ గళ్యాణరామప్రభూ !

నిన్నెందఱో భక్తులు సేవించి కృతార్థులైరని వింటిని. వారి నట్లు రక్షించితివో !

సీ. పస యింతయును లేని భవదీయఘనమంత్ర
పఠనంబు గిరిజ యేభంగిఁ జేసె ?
ఆదిపరబ్రహ్మ మంచును నిన్ను న
వ్వరమేష్ఠి యేరీతిఁ బ్రస్తుతించె ?
పరమద్రోహివి నిన్నుఁ బతితపావనుఁ డని
ప్రహ్లాదుఁ డేమాడ్కి భక్తిఁ గొలిచె?
పరసతీమణులను భంగపఱచునిన్ను
భర్తగా నెటు రమ బడయఁగలిగె?

తే. గీ. ఎంతవెదకిన నీయందు నుంతయేని
సద్గుణము కానిపింపదు; సకలమునులు
దేవతలు నిన్ను దేవాదిదేవునిగను
దలఁచి సేవించుచుండి రో దైవరాయ!

నిన్నుఁ గలనైన మఱువక నీనామస్మరణము చేసినందుల కొక్కింతయుఁ గరుణఁ జూపింపకపోయితివి కదా? ఇఁక నెందాక నిన్ను వేఁడుదును? నా కేమిగతి! నన్నిప్పుడు నీవు కరుణఁజూడవేని, యీ విషము గ్రోలి ప్రాణములఁబాసి సుఖించెదను. (విషపుగిన్నె బల్లపైఁ బెట్టి) అయ్యో! పాషాణముకంటెఁ గఠినమైన హృదయముగల నీవు నేను విషము త్రాగి చచ్చెదనన్న జాలిఁబూని రక్షింపవచ్చెదవా? ఏమి నా వెఱ్ఱి!

తే. గీ. నిందుమూలాలు అర్థాంగి నిర్మలాత్మ
యైనసీతామహాదేవి నడవి కంపి
నట్టి కఠినచిత్తునకు నాయందుఁ గరుణ
వచ్చునా! కేవలము వెఱ్ఱిభ్రాంతి గాక,

తండ్రీ! రఘునందనా! ఇదిగో నా కడసారి ప్రార్థన వినుము.

సీ. ప్రహ్లాదు నేల, స్తంభంబునం దుద్భవం
బైనట్టిమాట సత్యంబయేని
కరినాథుఁ గావ మకరినాథునిఁ బయికిఁ
జక్రంబు పంపుట సత్యమేని
సగవానరమ్మునిఁ బాలించి రాజుగా
నల్పినవాక్యంబు సత్యమేని
రక్షింపవేయన్న ద్రౌపదీసతికి వ
స్త్రంబు లిచ్చినమాటి సత్యమేని.

తే. గీ. నేడు సంపూర్ణకృపను గాపాడి నన్నుఁ
జెరవిముక్తునిఁ జేయుమా చేయకున్నఁ
గల్లయంచు నీమకథ జగంబునందుఁ
జాటెదను సుమ్మి! రఘుకులసార్వభౌమ!

దేవా! ఈమాటకూడ వినుము,

సీ. పక్షపాత మిదేల రక్షింపవా నన్ను
రక్షింపకున్న నీరమణితోడు
చెల్లింపవా? సామ్మి చెల్లింపలేకున్న
సాధ్వి మీతల్లి కౌసల్యతోడు
నేడుఁ బాపవా నాకుఁ జెఱబాధఁ గనకున్న
మీతమ్ముఁ డైనసౌమిత్రితోడు
యేలవా? నిజభక్తు నేలరాకున్న గు
రుండు తాపసి వసిష్ఠుండుతోడు.

తే. గీ. వేయునేటికి నానలు పెట్టినాఁడ
నీవిధంబున నింక నన్నేలరమ్మి
రావదేని విషముఁగ్రోలి ప్రాణములకు
బాసి సుఖయింతు; శ్రీరామ! భవవిరామ!

తండ్రి! నీవు రక్షించినను, రక్షింపకున్నను నిదియే సమయము. ఇఁక నే నీచెరయందుఁ గాలముఁ గడపఁజాలను. ఎన్ని దినంబులున్నను దేహికి మరణము ధ్రువమైయున్నది. శరీరపరిత్యాగ మొనర్చి నీ చరణసన్నిధికిఁ జేరెద. (తన్నుద్దేశించి) సకలేంద్రియములారా. మీరొక్కింతయు నిటునటు సంచారము సలపక యుండుఁడు! పదునాల్గుభువనంబులను గుక్షియందుంచుకొన్న మహానుభావుని, శరణాగతరక్షణబిరుదుఁ బూనినతండ్రిని, సకలామరముని జనవందితపదారవిందుని, లీలామానవదేహుని—నన్ను రక్షిం

పుమని నాహృదయకమలకర్ణిక మధ్యంబున నిలిపి, భక్తిం—గొలిచి యమ్మహాత్ముఁడు రక్షింపకయున్నచోఁ బ్రాణములు విడిచి శాశ్వత సుఖంబులందెద.

(కన్నులు మూసికొనుచున్నాఁడు.)

[శ్రీరామలక్ష్మణులు ప్రవేశించుచున్నారు.)

శ్రీరా—తమ్ముఁడా ! రామదాసును జూచితివా ! ఈపరమభక్తుఁడు మననిమిత్తముకదా యిట్టిదురవస్థఁబొందుచున్నాడు—అదిగో! గరళయుతమైనపాత్రి. మనము రక్షింపకయున్నచో దానిం ద్రావి ప్రాణములఁ బాయ నిశ్చయించి, యేకాగ్రస్థితమాన సుఁడై నన్ను స్మరించుచున్నాఁడు. ఇఁకనీతని రక్షింపవలయును. (నెమ్మదిగా పాత్రియందున్న విషమును నేలపైఁబారవేసి) రామదాసా! లెమ్ము. లెమ్ము. నేను తానీషాను నీపైకమంతయు వాకు ముట్టినది. ఇదిగో రసీదు. చేకొనుము. (రసీదు రామ దాసుముందుఁ బెట్టి తమ్మునితో) లక్ష్మణా! ఇఁక మన మరుగు దము. రమ్ము.

(తమ్మునితో నిష్క్రమించును.)

రామ—(కన్నులు తెఱచిచూచి తనలో) ఏమిది! నేను తానీషాను. నీ పైకము ముట్టినది. రసీదందుకొను మనుపలుకులు వినవచ్చినవే! ఎవరునుగనిపించరేమి? (ఎదుటనున్న పాత్రపడియుండుటఁజూచి) ఇదియేమి! ఇందుగరళ మేమైనది! (ప్రక్కనున్న రసీదుఁగాంచి) ఇదిగో! (చదివి) పైకము ముట్టినట్లు తానీషా మొహరుగలిగిన రసీదు. ఇదిమిగులవింతగనున్నది. ఈకార్యము నెవ్వరుచేసియుం దురు! (ఆలోచించి) భగవంతుండగు శ్రీరామచంద్రమూర్తికన్న నట్టి యమానుషకృత్యము లొనర్చుమహిమ మెవ్వరికి గలుగును? స్వామీ! నిన్ను నే నెఱుంగ లేకపోయితిని.

చ. "హరునకు నవ్విభీషణున కద్రిజకుం దిరుమంత్రనామమై
కరికి నహల్యకున్ ద్రుపదకన్యకు నార్తిహరించు చుట్టమై
పరగినయట్టి నీపతితపావననామము నాదు జిహ్వపై
తరమున నుండఁజేయఁగదె దాశరథీ! కరుణాపయోనిధీ!
నీమహామహిమయు, మాయయు వర్ణించుటకు బ్రహ్మేంద్రాదులకైనఁ
దరము కాదు.

కల్యాణి.—రూపకతాళము.

ఏమయ్యా రామ బ్ర - హ్మేంద్రాదులకు నైన -
నీమాయ దెలియవశమా॥ ఏ॥
కామాది విమలగుణ - ధామ కువలయ దళ-
శ్యామా నను గన్నతండ్రి రామా॥ ఏ॥
సుతుఁ డనుచు దశరథుఁడు - హితుఁడనుచు సుగ్రీవుఁ
డతిబలుండనుచు గపులు
క్షితినాథుఁ డనుచు భూపతులు కొలిచిరిగాని-
పతిత పావనుఁ డనుచు - మతిఁ దెలియ లేరైరి॥ ఏ॥
చెలికాఁడనుచుఁ బాండ - వులు విరోధివనుచు
నల జరాసంధాదులు కలవాఁడవని కుచే-లుఁడు నెంచిరిగాని-
జలజాక్షుఁడని నిన్ను సేవింపలేరైరి॥ ఏ॥
నరుఁడని నరులు తమ - దొరవని యాదవులు-
వరుఁ డనుచు గోపసతులు
కరివరద భద్రాద్రి - పురనిలయ రామదాస
పరమాత్ముఁడని నిన్ను భావింపలేరైరి॥ ఏ॥

భటుఁడు.—(రామదాసుని జూచి) క్యాజీ! బొమ్మన్ సాబ్! దిల్మే
ఖోత్ కుషీ గావుంది. తుమారా బాత్ మే వుంది. అదియేమ్టి
మియ్యా!

రామ—ఓయీ! సర్కారుకు నేనియ్యవలసినపైకము ముట్టినట్లు రసీదు.

భటు—క్యా క్యా! పైకం=రసీద్—ఛే లక్షరూపాయ్‌సర్కారుక్కుతుం దియేక్యా-రసీద్ కైసీ ఆయే= తుం కబ్ దియే! నిండా ఆశ్చర్యంవుంది.

రామ—నేను తానీషాగారి కొసంగలేదు. నేను కన్నుమూసికొనిభగవద్ధ్యానముఁ జేసికొనుచుండఁగా—నేను తానీషాను,నీపైకము ముట్టినది. ఇదిగో రసీదు; అనిచెప్పియిచ్చుట దానిని పెట్టివారు.

భటు—అరే సర్కార్ ఆయే క్యా! ఇదర్-చెప్పవోయ్. మాకు నిద్దర్‌లో వుండామ్.

రామ—నేనుస నాకన్నులతోఁ జూడలేదు.

భటు—నీకీ మంచిరోజ్ వచ్చింది. మాల్లా నీయందు వుండాము.

రామ—ఓయీ! తెల్లవాఱవచ్చుచున్నది. నన్ను స్నానమునకుఁ దీసికొనిపోవుదువా?

భటు—అచ్ఛా! ఆవ్.(తలుపుదీసి రామదాసుతో నిష్క్రమించును.)

రంగము:—తానీషా యంతఃపురము.

[తానీషా, భార్యయు ప్రవేశింతురు,]

భార్య—నాథా! మరల తొందరగా మేల్కొలిపితిరేమి?మరల నేదైన స్వప్నము వచ్చినదా యేమి! ఈరోజున మీకుస్వప్నముమీద స్వప్నము వచ్చుచున్నట్లున్నది.

తానీ—స్వప్నము కాదు. అంతయు నిజమే.

కన్నడ—ఏకతాళము.

కలనిజమాయెనే - ఓ - కలికిరోవినవే - కలనిజమాయెనే॥

కలి॥ చూపునబాలురే - సొగసైనరాతురే.

రేపునరారే యీరామామణినమ్మెది। కల।
నామదిలోన నరులన గానరే- నేమహిలోన నెఱుఁగనివారే। కల॥
పురుషులుచూడఁగ - పురాణపురుషులే
మర్యాద లేదె మహానుభావులే। కల।
దాసజనావనులే - జాలికబీరులే
వాసవవినుతులే - వారిజనేత్రులే। కల।
భద్రాద్రివాసులే - భవ్యయశోద్భవులే
భద్రాద్రి రామదాసపాలిత చిద్విలాసులే। కల।

రమణీ! ఆవచ్చినది దేవాదిదేవుండగు శ్రీరామచంద్రమూర్తి యని తెలియంగలేక పోయితిని. ద్వారతలమునఁ దలుపుఁగొట్టినపుడు సామాన్యులని తలంచితిని. వారిచ్చినపైకముఁ గాంచి మోహ మందితి గాని, భువనరక్షణపరాయణుఁ డగురఘునందనుఁడు లక్ష్మణునితో నిట్లు వచ్చెనని భావించి కనకాసనమిచ్చిపూజింప నైతిని. పరమభక్తాగ్రేసరుఁ డగురామదాసుని రక్షింపఁదలఁచి వచ్చినయమ్మహానుభావుల పాదములపైఁబడిరక్షింపుఁడని వేఁడు కొననైతిని.(అంతక యూరకుండి) ఇఁకనైనరామదాసుని చెఱ విముక్తుఁజేసి నాయపరాధమును సహింపుమని వేఁడుకొందుఁ గాక. .(నిష్క్రమించును.)



రంగము — చెఱసాల.

[రామదాసు ప్రవేశము.

రామ—శ్రీరామునుద్దేశించి) రామచంద్రప్రభో! ఆర్త రక్షణకలా ప్రవీణుండవగు నీవు నాయెడలఁ గరుణించి యీమాయయొనర్చితివి. నీమహామాయ గుర్తింపలేక పోయితిని కదా!

[తానీషా ప్రవేశించును]

తానీ—అరే! కోన్ హై!

భటు—(ప్రవేశించి) సర్కార్!

తానీ—జైల్ కాదర్వాజా జల్దీ ఖోలో! రామసేవక్ రామదాస్కో ఛోడ్ దేకా.

భటు—(తలుపు తీయును.)

తానీ—(భటునిఁజూచి) ఓ బేడి నికాల్ దేవ్!

భటు—(రామదాసు సంకెళ్లు తీసివేయును.)

తానీ—(రామదాసునిఁజూచి)

సౌరాష్ట్రి—ఆది.

రామదాసుగారూ రండీ - రసీదందుకొండి | ప్రేమమీర శ్రీరా
 మలక్ష్మణులు- తామే ధనమంతయు చెల్లించిరి॥ రామ॥
ఎంతపుణ్యమతివో యీశ్రమ-నెట్లు సహించితివో।యింతవాఁడవని
 యెఱుఁగక చేసితి-వంతము చకురయు వరమదయాళో రామ॥
తప్పులెన్నఁబోకు ఇఁకనీ-యప్పుదీరెమాకు తప్పుబోసి ధన। మప్ప
 గింపక యె- తిప్పపాటునను జెప్పకపోయిరి। రామ।
కానసైతిమున్ను ఇంతటి-ఘనుడవనుఁచునిన్ను మానుచలముక్రొవ
 మదిలోనుంచి స -న్మానముగా నను మఱువకబ్రోవుము। రా।
తురకజాతిగనుక నేను-తుచ్ఛబుద్ధినైతి।నరహరిభక్తుఁడవని నినుదెలి
 యక- పరిపరివిధముల బాధలపఱచితి। రామ।
రామదాసువనుచు దెలియక-రవ్వచేసినాఁడ।ప్రేమభద్రగిరి ధాము
 లైన శ్రీరామలక్ష్మణుల కేమి కటాక్షమొ। రామ॥

మ. అపరాధంబు లహర్నిశంబులు మదీయంబైనదుర్బుద్ధిచే
 విపరీతంబుగఁ జేసినాఁడను భవద్విఖ్యాత కారుణ్యదృ

ష్టిపథంబందున నన్నుఁ బెట్టి యిఁక రక్షింపఁగదే దేవ! నే
నపవిత్రుండఁ బవిత్రుఁ జేయుము మహాత్మా! రామదాసాభిధా.

రామదాసుగారూ! నేను మీమహిమ నెఱుంగలేక నజ్ఞానాబ్ధిలోఁ బడి మిమ్ముఁ జెఱఁబెట్టి మహాపాపముఁ గట్టుకొంటిని. మీరు నన్ను క్షమించవలయును.

రామ—తానీషా! నీవెంతయు ధన్యుఁడవు. నన్నుఁ గన్నతండ్రియగు రామచంద్రమూర్తిని గన్నులారఁ గాంచితివి. నీవు పూర్వభవంబున మహాపుణ్యముఁ జేసికొనియుండుటం జేసి, శ్రీమన్నారాయణస్వరూపుం డగురామభద్రుని దివ్యమంగళవిగ్రహసందర్శనభాగ్యము లభించినది.

మ. కలనైనన్ గన కర్తలాదురె తదాకారంబు వీక్షింప, న
న్నలినప్రోద్భవముఖ్యదేవతలకైనంగాని; త్వల్లోచనో
త్పలసాఫల్యముఁ జెందఁ గాంచితివి తద్భద్రాయితాస్యేందుమం
డలి; ధన్యుండవు నీవు భూతలములోనన్ మ్లేచ్ఛవంశాగ్రణీ.

నీవుఁగూడ మాదాశరథికి దాసుఁడవైనాఁడవు (ఇంచుకయూరకుండి) పాదుషాగారూ! పైకము ముట్టినదని నన్ను రసీదు మరల పుచ్చుకొనుమని పలుకుచుంటిరే. ఇంతకుమున్న మీరిటకువచ్చి రశీదు నొసంగి వెడలితిరి గదా!

తానీ—(ఆశ్చర్యముతో)ఏమీ! నేను నీకు రసీదు నొసంగియుంటినా? ఏది-ఏది!

రామ—(రసీదును చూపించును.)

తానీ—(చూచి) ఆహా! ఏమి యీవింత! ఇయ్యది నేను మహానుభావులగురామలక్ష్మణుల కొసంగినదే. ఇది యిక్కడికెట్లువచ్చినది! భగవన్మాయ వర్ణనాతీతము. (ఇంచుకయూరకుండి) రామదాసుగారూ! మీకటాక్షమున నేను శ్రీరాముని దర్శింపఁగంటిని.

రామ—భగవంతుఁడు నీయందుఁ గరుణించినాఁడు.

తానీ—

మ. అనఘా! నిన్నును రామసేవకుఁడుగా వార్తన్ విచారించకే
ఘనకారాగృహవాసుఁ జేసి యకటా! గారించినాఁడన్ మనం
బున నాదుర్గుల సైచి రామునిపదంబుల్ నమ్మి భద్రాద్రి యం
దున నీవెప్పటిరీతినుండు మిఁక సంతోషంబు దీపింపఁగన్.

నేఁటికి నీవు మహాభక్తుఁడవని తెలిసినది. నాయపరాధంబులన్నియు మఱచిపొమ్ము. శ్రీరామచంద్రుఁ డొసంగినవైకము నీవుగైకొనుము.

రామ—పాదుషాగారూ! మీరు నాయెడలఁ జూపుచున్న వరమానురాగమునకు సంతసించితిని. కాని, యొక్కసంగతిమాత్ర మున్నది.

మ. అనఘుండై రఘురాముదివ్యచరణధ్యానంబుఁ గావించుచున్
దినముల్ బుచ్చెదఁ గాక, యేలయిపుడర్థిన్ నాకు నుద్యోగమున్
బూనఁ గార్యంగఁదలంతురియ్యదియుశోకంబున్ గూర్చునా; మోదమి
చ్చునె! యింకేటికి నాకు దీనిపనిసంశుద్ధాత్మ మ్లేచ్ఛాగ్రణీ!

ఇఁక నాకట్టిసుఖములతోఁ బనిలేదు. నన్ను క్షమింపుఁడు. మీరిచ్చెద నన్నవైకము శ్రీరాములకొఱకే వినియోగింపుఁడు.

తానీ—రామదాసుగారూ! మీరట్లు చెప్పవలదు. నన్ను మన్నించి మీరెప్పటివలెనే భద్రాచలమున తహసీల్దారుగ నుండి, యాస్వామికి కైంకర్యాదిసత్కారంబులఁ జేయుచుండుఁడు ఈ వైకము మీరుగైకొని భగవత్కార్యములకై వినియోగపఱచుఁడు. ఇదియుఁగాక, భద్రాచలము శ్రీరామునకు మాన్యముగా నొసంగినాఁడను. శ్రీరామానుగ్రహమునకుఁ బాత్రుఁడవై

భద్రాద్రియందుండి సుఖించుము. రామదాసా! ఇంక నేమికావ
లయును?

రామ—ఇంకఁ గావలసిన దేమున్నది?

మ. వరభద్రాచలవాసుదివ్యపద సేవాభోగులై మానవుల్
స్థిరసౌఖ్యంబులఁ గాంచి, పాపమున వాసిం బాసి, సంసారభీ
కరవారాసిఁ దరింతురింక; నిజభక్తశ్రేణినిట్ల రాఘవే
శ్వరుఁ డశ్రాంతము బ్రోచుఁగాక, కరుణావ్యాపార మేపారఁగన్.

(తెర వ్రాలును.)

ఇది పంచమాంకము.

గ్రంథము సంపూర్ణము



# అనుబంధములు



## 1. వృద్ధబ్రాహ్మణుఁడు.

ఫీలు—త్రిశ్రగతి.

అనాధుఁడైతినే। ననా।
అకట నుడివడి బడలి। యనా॥
ఏదరిఁ బొడగనిన భిక్ష। మిడువా రొకరయిన లేరె।
నాదరిద్రదశ బొడగని యాదరించువారు లే। రనా

---

## 2. దేవలుఁడు & బ్రాహ్మణుఁడు.

బ్యాగ్—ఆది.

దేవ—ఇటులతగునె విప్రవర నీకునే। వదురుటెపుడు లేక కార్యమొన రుకు। ని।

బ్రాహ్మ—కటకటా నాదు గర్భశోకమా। కట జ్వలియించుచునుండ శ్రీరంగ। నీతులను వన్యసింపనెటులోర్తు। నీతిమాలియుంటివా యిటు కఠినమతి।

దేవ—హరహరా భగవదర్పితమే యిది। యామహాత్మునకు గానీయక నీ। పరమరసరయుక భుజించిన భగవ। దపచార మెటుభరింయించెదమది॥ ని।

---

## 3. తాసీమా.

కల్యాణి—రూపక,

ఈరాజ్యభారమ। హీనకార్యము॥ ఈ।
ధారుణీజనులకు హాని। దగులక
భరింపఁగవలయునఁటన్నను॥ నీరా॥

నయనశ్రవణములను గలిగి । నయగతినననయంబుగనుచు ।
వినుచు చారులవార్తలరయుదు । ఘనతరముగ ।
విమర్శనము గావించుచు॥ నీ॥

4 సుశీల.

నాదనామక్రియ — ఆది.

ప॥ ఎటుభరియింతురా । యేగతిరా సుత ।

అ॥ ప॥ కటకట నామది గాల్చు దుఃఖము నే॥ నెటు॥

చ॥ పటుతరాయుర్ధనయశంబులతో । వర్ధిల్లెదవని పలికినజ్యోస్యుల
పలుకులు నేటికనర్థంబులుగా । బరిణమించెనయ్యో నాహత
విధి॥ యె॥

కడుపారఁగ నినుఁగాంచి పెంచి యీ । కాలమునకునిను గంగఁ
గలుపఁగా । గడుదయావిహీనుండయి యావిధి । ఘనతరముగ
లిఖయించెనెలనయా॥ యె॥

5. గోవన్న.

నాదనామక్రియ — ఆది.

నా దుఃఖమును తీరిపోయెనా । హా । హా । హా । హా । నేటికి॥ నాదు॥
ఆ దయావిహీనుండగు విధియే । యెరపురలరయ్యక । చిఱుతసినీగతి ।
నిర్దయామతిని । నినుగానిపోయెన । నిన్నేవిధమున । మరతునురా
సుత॥ నా॥

6. డైలాగ్.

హిం॥ తోడి — రూపకం.

సుశీ — ఓబాధా । దీనావస్థ । మగుట మాకీఁకెపుడుగల్గునోకదా॥ ఓ॥

కుమారుఁడు—ఓ తండ్రి । మీదర్శన । మ్మేటమాకుఁ గల్గునో
కదా॥
రామ—రమణి । రమా । రమణునికృప । యేవాఁడుగలుగును।
యపు । దమరుమనముగాంచు భాగ్యముల్ । మదిలో నీ ।
విటు చాల । నుదలీ చిం । తిలనేల। సకలజగద్విధాయకుఁడుద
శావతారములచుదాల్చి । యఖిలకష్టములను గాంచె॥
హుస్సేన్—జీ - చెలో
యూఖా—చెలో - జావ్ -
బ్రాహ్మ—సకలభువనపాలనా । వ్రి । సన్నరామగావరా ।మా రామ
దానువేగ మాకొసంగుమా । వం । దన । ము । య్యా ।
మీకు॥
సతి—ఓనాథా॥

---

7, రామదాసు.

ఫీలు—ఆది.

ప॥ సీతా । రామస్వామి । నే । జేసిన పాపంబేమి॥ సీ॥
చ॥ శ్రీమతో । నవరత్నంబులు చెక్కిన । హేమకిరీటంబడిగితినా।
కోమలమగు సీమెడలో పుష్పపు దామమునిమ్మనియడిగితినా
కమలేక్షణ నినుసేవించుటకయి । ఘనముగరమ్మని పిలిచితి
గానీ॥ సీతా॥

---

8. రామదాసు.

మధ్యమావతి—ఆది.

మామపట్టాభిరామా । జయ । మారుతిసన్నుతనామా। మా

కోమలతరపల్లవపద । కోదండరామ ఘన । శ్యామలవిగ్రహాబ్జనయన సంపూర్ణ కామా । రఘురామ । కల్యాణరామచంద్ర॥ మా॥

ఛత్రచామరకరధృత । భరతలక్ష్మణ । శతృఘ్న విభీషణసుగ్రీవ ప్రముఖాదిసేవిత । పాత్రదశరథపుత్ర । మణిరంగవల్ల్యలంకృతనవరత్నమంటపే । విచిత్రమణిమయ సింహాసనే । సీతయా సహా సంస్థిత సుచరిత్ర । పరమపవిత్ర । గురుగుహామిత్రవంశపవిత్ర । వంశసుధాంబుధిచంద్ర । మేదినీపాల రామచంద్ర॥ మా॥

---

## 9 రామరాసు.

శ్రీరాగం—రూపకం.

భజభజమారుతినుతనామ ! కోదండరామ॥ భ॥

అజరుద్రసురేశకిరీ । టాలంకృతమణిమండిత । చరణకమలయుగళశశివిభాకర శ్రీకరలోచన॥ భ॥

శరణాభయశంఖచక్ర శార్ఙ్గగదాలంకృతపద । శ్రీవత్సాంకాంచిత తను । సేవిత సనక సనందన॥ భ॥

---

## 10 కబీరు.

హిం॥ తోడి—ఆది.

(26 వ పుటలో నిమ్మ్రించునప్పుడు పాడవలెను.

రామభజనకోదియా కమలముఖ॥ రా॥

(1) లోకచారసే । ఫేరేఫిరకా । సుందరసరయా కమలముఖ॥ రా॥

(2) ఖాయాపీయా । సుఖసేసోయా । సహిజమానాకోయా కమలముఖ॥ రా॥

(3) జోముఖనిసదిన రామనామకే । సోముఖకుచినహిఁజీయా కమలముఖ॥ రా॥

(4) కహతకబీరా । సునొభైసాధూ । ఆయాహైసాగాయా కమఅముఖ। రా।

---

1. రామదాసు.

ఝ్యాన్—త్రిశ్రిగతి.

మందరధర । మంగళకర । మంగళంబురా।మారసుందరా।జ। శ్రీరమేశశ్రీవరా । దానభరణ । దోషహారణదానవేశనాశా । రాజరా । జేశ్వరా । రామవరాత్పరా । శ్రీనివాస జగదీశా । శ్రీరమానాయకా । జగన్నాయకా।



# ప్రతాపరుద్రీయము.

(గ్రంథకర్త:—సోమరాజు రామానుజరావుగారు)

ఇందు చెకుముకిశాస్త్రి ఢిల్లీనుండి తురకలచే నవమానింపఁబడి క్రోధముతో ఓరుగల్లుచేరుట, విద్యానాథకవి ప్రతాపరుద్రమహారాజుదర్శనమునకై బయలుదేరుట, ప్రతాపరుద్రమహారాజు అడవివేటకై చనుదెంచుట, యుగంధరమంత్రి తీర్థయాత్రలకు వెడలునపుడు రాజ్యతంత్రమంతయు తనతమ్ముఁడగు జనార్దనమంత్రి కప్పగించుట, రాజు మంత్రి, యెఱుకలేనిసమయ మెఱింగి ఢిల్లీనుండి తురకదండు కోటగొట్టుటకై వచ్చుట అడవియందు ప్రతాపరుద్రుడు అలసి నిదురించుసమయంబున కరములకు తురకదండు శృంఖలాబద్ధునింజేయుట, ప్రతాపరుద్రుడు మేల్కాంచి శౌర్యముతో కరములనున్న శృంఖలములను త్రెంపి తురకదండుపై గవయుట. తురకలు అతిచమత్కారపుమాటలచే తప్పించుకొని మత్తుమందుచే రాజును పట్టుకొనుట, జనార్దనమంత్రి రాజును పట్టుదురన్నభయముచే రేవుయందలి డింగీలు గాని, బల్లకట్టులు గాని లేకుండ నాగ్దరుచేయుట, జనార్దనమంత్రి యాగ్దరు యందనివకడింగీని తురకలు మాట్లాడి అందు రాజు నెక్కించుకొని ఢిల్లీకి గొంపోవుచుండుట, విద్యానాథుఁడు రాజును గొంపోవుచుండిరని తెలిసి గోదావరిలోదూకి రాజున్న పడవనెక్కి రాజుతో రహస్యముగా సంభాషించుట, యీసంగతి జనార్దనమంత్రితో చెప్పుట, యుగంధరుఁడు ప్రవేశము రాజును తురకలు. తీసికొని వెళ్లినందుకు కొంత చింతించి తుదకుధైర్యము తెచ్చుకొని చాకలిపేరిగాడిని రాజుగాచేయుట,(పేరిగాని తమాషాలు చదివితీరవలెను.) రాజునుఏడు మాసములలో తెచ్చెదనని రాజు తల్లిదగ్గర ప్రతిజ్ఞచేసి పిచ్చివానివేషమున ఢిల్లీ ప్రవేశించి "ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్" అని వెర్రికేకలు వేయుచు ఊరంతయు తిరుగుట (పిచ్చిమాటలు అద్భుతము జనింపఁజేయును) చెకుముకిశాస్త్రి తురకల నవమానింపవలెనని ప్రతిజ్ఞపట్టి రాజుకొరకై తానుకూడా కష్టపడి, మారువేషమున జ్యోతిష్కుఁడవని తురకలవద్ద ప్రవేశించి తురకలను రోసమున నొకరొకరికి విరోధముపెట్టి వారికి అంతఃకలహములు జనింపజేసి యొకరిచేనొకరిని చంపింపవలచుట, ఢిల్లీలో పిచ్చివాడగు యుగంధరునికేకలు, పిచ్చివాడుచేయు అల్లరులు,పిచ్చివాడుచేయు తమాషాలు చూచి హాశ్చర్యముజనింపకమానదు. యుగంధరుఁడు ఢిల్లీప్రవేశించిఅనేకమాయోపాయములుపన్నిరత్నపుసరుకుతో తనకోటయందున్న వీరశెట్టి మొదలగువారలను ఢిల్లీరాజగు సుల్తానుదర్శనమునకు రత్నపుసరుకు తీసుకువెళ్లునట్లుచేయుట, సుల్తాను రత్నపుసరుకుచూచి హాశ్చర్యముపొందుట. వర్తకులు మాఱోడయం దింతకన్న మంచి సరుకులుగలవని వంచించి సుల్తానును ఓడకు రమ్మనుట. మొదలగునవి యిందుగలవు.

వెల 1—4—0.

# రాణాప్రతాపసింగ్.



(గ్రంథకర్త: ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారు)

ఇందలికథ మన భారతవర్షచారిత్రమునకెల్ల నమూల్యాలంకార సదృశము. ఏతత్కథానాయకాగ్రణి భారత సార్వభౌములలో మేరుమణిగాఁ బేర్కొనఁదగు చిత్తూరు మహారాణాయగు "రాణా ప్రతాపసింగు" అద్వితీయ రాజనీతికోవిదుండగు నక్బరు పాదుషాయంతవాఁడు తన్ను సాధింపనెంచి చతురోపాయంబుల సహాయశక్తుల నెంత ప్రయత్నించినను, జితోస్మి యనుమాట తననోట రానీయక యిరువదిసంవత్సరములకుఁ బైగా నాటవికులమధ్య భార్యా పుత్రాదులతో పడరానియిక్కట్టులకుం బాల్పడి తుట్టతుద కా మ్లేచ్ఛసార్వభౌముని మహాసైన్యమును తదగ్రేసరులగు హిందూ మహమ్మదీయ దండనాయకులను, స్వకీయ మహాబల ప్రసారంబున దూదిబుంగలవలెఁ బాఱఁద్రోలి శత్రువశమునైన దుర్గములతోఁ పాటు రాజధానియగు నుదయపురమును స్వాధీనము చేసికొని మేవాడ రాజ్యలక్ష్మికి మ్లేచ్ఛసంపర్క కళంకము లేకుండఁజేసి రసపుత్రప్రతిష్ఠ పునరుద్ధారణము చేసిన మహానుభావుని చరిత్ర మత్యద్భుతముగా వర్ణింపఁబడినది. ప్రతాపసింగు సోదరుఁడగు సాగరజీ శత్రువులతోఁ గలిసి యుద్ధమునకు వచ్చుట, చారణభట్టుయొక్క సహాయవాత్సల్యము, జయసింగు ధైర్యశౌర్యములతో, శత్రువుల నోడించుట, అక్బరు-ఆడదాని వేషముతో దంట్లు అమ్ముట—(ఇచ్చట ప్రతివారికి అగ్బరును చూచిన నవ్వు రాకమానదు) చిత్రకారిణియొక్క తమాషాలు, చంద్రకళయను బోగముదిచేయువింతలు, మానసింగుయొక్క కుట్రలు, సలీమ్‌యొక్క సరదా, గులామ్‌యొక్క హాస్యరసమైన మాటలు, రణమల్లుల విచారము, మోహినియొక్క ఉపచారము, తుదకు జయసింహ మోహినీల వివాహముతో చక్కని పద్యరత్నములతో నవరసము లాలకించునట్లుగా రచియింపఁబడినది. అనేకచోట్ల ప్రదర్శింపఁబడినది. కొలది ప్రతులు మాత్రమేగలవు త్వరపడుఁడు

వెల స్వల్పము 1—0—0 మాత్రము.

---

# రసపుత్రవిజయము.

(గ్రంథకర్త — ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారు)

రసపుత్రవీరజ్యోతి హైందవ సామ్రాజ్యలక్ష్మీధురంధరుఁడగు నాలంఘీరు బాదుషా నురూపితలూగించెనో, ఏప్రచండవీరావతారము రాజకీయరంగమున నవనవాదర్శములం బ్రదర్శించెనో. ఏవీరసింహనాము క్షాత్రవగుణములకు సింహస్వప్నమో యా మేవాడ సార్వభౌముఁడగు రాజసింహుని దివ్యచరిత్ర. ఠాకూర్ దుర్గాదాసు నాటకమున సన్యాసివేషమున స్వాతంత్ర్యసంపాదనము సలిపెను. వీరమాత మహావీరమాతయై విలసిల్లినది; విమలమానసయగు విమల — ఏశారీలలామము జన్మమున, రూపనగరాధీశ్వరుని గర్భవారాశితోపాటు భారతేందిరాలలామము ధన్యగాలయ్యెనో — యాకల్యాణగుణవతి, శ్రీరాజసింహవీరులపాణిగ్రహణాధీనమనస్కయై కావించిన యమానుషకృత్యములు — వీరవిహారములు — పడినకష్టములు చదివితీరవలయును; విమలసోదరి యగు ధర్మచ్యుత కేసరిబీగం, ఆలంఘీరు బాద్షాను పెండ్లియాడి విమలతోఁ బ్రతినబూని యామెను తురకకిచ్చి పెండ్లిచేయ యత్నించి తుదకు తానే రసపుత్రుల చేతులలోఁ బడుట, ఔరంగజేబు సేన లాహారపానీయములు లేక గుహలో చిక్కుపడుట. దుర్గాదాసు ప్రచ్ఛన్నవేషమున, రూపనగరభైరవాలయమున చెప్పిన జ్యోతిషమున శృంగార రసోదయమగుచున్నది. విమల విసరినపూలగుత్తి మన్మథునిఫిరంగిగుండై రాజసింహు నివక్షమునం దగులుట, చదువరుల నానందరసాంబుధిని నోలలాడించును. గులాము చంద్రభోగల హాస్యము, తురక పెండ్లికొడుకు వెత్రిసరసము, గులాము చమత్కారము బాలుండగు అజితసింహుని శూరత్వము — అద్భుతసమన్వితములు. వింతలోవింత — విమలను గాపాడుటకై మునివేషముతో వచ్చిన వీరమాతను గాంచి విమల రాజసింహునిగా నెంచి శృంగారసంభాషణము చేయుట, ఆసమయమునకే వచ్చిన రాజసింహుఁడు వీరమాతను పరపురుషునిగ భ్రమించి యాగ్రహపడుట మిగుల చమత్కార రంగము. ఆలంఘీరు కాశీవిశ్వేశ్వరాలయధ్వంసము చేయుట హిందువులమానసములం గలచి గగుర్పాటుగలిగించుట చేయుల దేశభక్తిపూరితము. పద్యములో క్కొక్కటిలక్ష రూపాయల విలువగలది. ఆంధ్రదేశ రంగస్థలములందంతటను వీరతాండవము సల్పిన మహాచరిత్రవీర నాటకము. ఔరంగజేబు పరిపాలనమంతయు నిందున్నది. చదివిచూడుఁడు. నవరసములు వర్షించునాటకము ఇప్పుడిట్టి నాటకరాజమే తెనుగున రచింపఁబడుటలేదు.

వెల 1—0—0.